తాన్ని నేనామోదిస్తాను. అమలుజరుపు తాను. మనిషి-మనిషిని నమ్మకపోతే మనుగడ కష్టసాధ్యమౌతుంది.

నాకు విశ్వపతిగారి మీదకానీ, అనంతరావు మీదకానీ అవిశ్వాసం లేదు.

ఇద్దరినీ విశ్వసించాను. ఎటొచ్చీ అనంతరావు మా యిద్దరిమధ్యా దూరం పెంచే ప్రయత్నంచేశాడు. దానికి కారణము కథా ఉన్నాయన్నాడు.

మిస్టరీ విడాలి.

అనంతరావే విప్పాలి.

అంతవరకూ హృదయం డోలాయమానం కాకతప్పదు.

సస్పెన్సు విడితే తప్ప - అటు విశ్వపతిగారూ, యిటు అనంతరావుగారూ- వీళ్లగురించి నేనొక నిర్ధారణకు రాలేను.

ఎదురుచూస్తున్న లంచ్ టైము రానేవచ్చింది.

పేరుకి లంచ్ బ్రేక్ కానీ - నిజానికి గుమాస్తాలప్పుడు తీసుకునేది కాఫీ మాత్రమే.

కాఫీ సేవించి - సిగరెట్ అంటించి- మొదలుపెట్టాడు అనంతరావ్.

"జీవితంగురించి మీ ఉద్దేశమేమిటి ?"

"అంటే ?" అయోమయంగా చూశాడు. నిజంగా అనంతరావు ప్రశ్నలోని అంతరార్థం నాకర్థంకాలేదు.

"జీవితం ఎలాగడిస్తే బాగుంటుందనుకుంటున్నారు ?"

"సుఖంగా, సమస్యారహితంగా..."

"అవునా ?..." విజేతలా నవ్వి - అంతలోనే సీరియస్సయిపోయి, "అన్ని సమస్యలకీ, దుఃఖాలకీ మూలంసంసారం అంటే మీరు ఏమంటారు ?" అని ప్రశ్నించాడు.

"సగం సత్యంకావచ్చు."

"థాంక్యూ ఫిఫ్టీ పర్సంటైనా ఏకీభవించారు. సంసారం అనేది సాగరం. సముద్రంలో ఎంతటి యీతగాడయినా అలసిపోయి అంతరించిపోవలసిందే తప్ప అవతలి ఒడ్డు చేరలేడు. అలాగే సంసారంలో సుఖంకూడా..."

కొంచెం విసుగేసింది

బహుశా నా ముఖంలో ఆ భావం ప్రతిఫలించిందేమో !

"క్షమించండి. నేను కొంచెం రచయితని. అందుచేత..." నవ్వేసి- "ఊఁ, సూటిగా చెప్పేస్తాను. విశ్వపతిగారికి ఆరుగురమ్మాయిలు," అన్నాడు అనంతరావ్.

"ఐతే ?" నిజంగానే అర్థంకాలేదు నాకు.

"చంపారు. ఇంకా కుండబద్దలు కొట్టినట్లు చెప్పమంటారా ?" సిగరెట్ అంటించాడు అనంతరావ్. రచయిత టెక్నిక్ నామీద ప్రదర్శిస్తున్నాడు ! జాలిపడ్డాను. నా గురించి అతనికి తెలియదు మరి. కథలే సాహిత్యమైతే- నేను

సాహిత్య సాగరమథనంలో కాకలు తీరినవాడినే.

"నేటి సమాజంలో ఆడపిల్లల తండ్రుల అగచాట్లు మీకు తెలుసను కుంటాను."

"ఊఁ."

"ఈ వ్యవస్థలో ఆడపిల్లల తండ్రి. వాళ్ల పెళ్లిళ్లకోసం ఎన్ని అవస్థలయినా పడాలి. మధ్యతరగతి మనిషి - సమస్యల పుట్ట."

"ఊఁ."

"ఏమిటండీ మీ అమాయకత్వమూ మీరూనూ! నయమే. నేను ముందు చెప్పకపోతే మీరు తప్పకుండా విశ్వపతిగారు పన్నేవలలో చిక్కుకునే వారే!"

"వల!"

"కాకపోతే? రంగులవల... మీరు తప్పకుండా ఆ వలలో పడిపోయేవారే!" అసమర్థుడైన రచయిత వ్రాసిన కథలో సంభాషణని తలపింపజేస్తూంది అనంత రావ్ ధోరణి. ఈ నాన్పుడంతా అతను సస్పెన్సుగా భ్రమపడటంలేదుకద?

"మీరు బ్రహ్మచారులు. ఆయన కారుగు రమ్మాయిలున్నారు. కనుక... యీక్వేషను సరిపోలా?" నవ్వాడు అనంతరావ్. "ఆయన ఆహ్వానంలోని అంతరార్థం ఇదే. తరవాతమీఇష్టం..." ఒక క్షణం ఆగాడు. "మీరు నమ్మలేక పోతున్నారుకదూ?"

మౌనందాల్చాను.

విశ్వపతిగారిమీద ఆ క్షణంలో చాలా సానుభూతి కలిగినమాట నిజం. ఆడపిల్లలు కలవారి అవస్థలు నేను విన్నాను

విశ్వపతిగారి తప్పేమయినా ఉంటే- అది అందరు పిల్లల్ని కనడమే. అందుకు పూర్తిగా ఆయన ఒక్కరే బాధ్యులు అయి ఉండకపోవచ్చును. ఆ పరిస్థితు లెటువంటివో? అప్పటికి కుటుంబ నియం త్రణంగురించి యింత ప్రచారం జరిగి ఉండకపోవచ్చును. ఏదేమయినా విశ్వపతిగారు ఆరుగురమ్మాయిల తండ్రి. అమ్మాయిలకి పెళ్ళిచేసేందుకు ప్రయ త్నించడంలో ఆయన అపరాధమేమీ లేదు

"మాధవ్! మీరింకా చిన్నవాళ్ళు. జీవితం ఎంజాయ్ చెయ్యాలంటే బ్రహ్మ చారిగానే సాధ్యం. జీవితమంటే సుఖ పడటం. సమస్యలని తలకు చుట్టుకోడం కాదు. వివాహం అంటే - పరిష్కారం దొరకని దీర్ఘసమస్యే అందుచేత వీలయి నంతవరకూ వివాహానికి దూరంగా ఉండ డమే వివేకం."

అనంతరావు జీవితానికిచ్చిన నిర్వ చనం నాకు నచ్చలేదు. సమస్యలులేనిదే జీవితమేమిటి? ఎవరో ఆంగ్లరచయిత అన్నట్లు-"వాటీజ్ లైఫ్ ఇఫ్ నాట్ కేర్స్ అండ్ ఆంగ్జయిటీస్?"

అయినా జీవితమనేది నిర్వచనాని కందేది కాదనుకుంటాను. ఎవరి

జీవితానికి వారే నిర్వచనం యిచ్చుకుంటే కొంత న్యాయంగా ఉంటుందేమో! ఇది నా ఉద్దేశం.

లంచ్ టైము దాటింది.

సీటులోకి నడిచాను.

ఐదారు గజాలదూరంలో - ఒక మూలగా విశ్వపతిగారు కనిపించారు.

ఆయన నెలా ఉన్నారు?

ఆరుగురు అమ్మాయిల కన్న తండ్రిలా.

ఆయన నొసటిమీది ముడతలు?

సమస్యలలా.

ఆయన ముఖం?

మధ్యతరగతి మనిషి జీవితం తాలూకు ప్రతిబింబంలా.

జాలివేసింది.

అనంతరావు మిస్టరీ విప్పేశాడు.

ఇక ఆలోచించుకోవలసింది నేనే.

సాయంత్రం వారింటికి వెళ్ళాలా, వద్దా?

వస్తానని వాగ్దానంచేశాను. నిన్న డిసపాయింట్ చెయ్యడమే క్షమించరాని నేరం.

పైగా-యివాళ 'తప్పకుండా' వస్తానని చెప్పాను కనుక- వెళ్ళితీరవలసిందే.

ఈ విషయంలో యింకా ఆలోచన కాని, యింకొక నిర్ణయంకాని ఉండకూడదు.

మెదడు కొంచెం తేలికపడినటనిపించింది.

ఫైలందుకుని డ్రాఫ్ట్ తయారుచేయసాగాను.

పదిహేను నిముషాలకు ఆ పని అయిపోయింది.

మళ్ళీ విరామం.

మళ్ళీ ఆలోచనలు.

ఆలోచనలు కూడా ఒకవిధమైన వ్యసనమే అనుకుంటాను సాధారణంగా రచయితలీ వ్యసనంలో చిక్కుకుంటారు ఐతే - వారు ఆలోచనల కొకరూపం యిచ్చి - కాగితంమీద పెట్టేసి — తేలిక పడతారు. విపరీతంగా చదివే పాఠకులకి ఆలోచించే వ్యసనం అలవడుతుంది తప్ప - ఆలోచనలభారం వదిలించుకునే మార్గం ఉండదు. బహుశా యిదే కారణమేమో - ఎక్కువ చదివినవారు రచయితలు కావడానికి.

నా కనుల వెనక దృశ్యాలు కదులుతున్నయ్.

విశ్వపతి గారింటికి వెళ్ళాను - ఆయనతో.

ఆ యిల్లెలా ఉంటుంది?

పేదరికానికి ప్రతిబింబంలా.

ఆ యిల్లాలు?

సమస్యలకి సమగ్రచిత్రంలా.

ఆ పిల్లలు?

ఒక్కొక్కరూ ఒక్కొక్క గడ్డు సమస్యలా.

నేను యింట్లోకి నడుస్తాను.



మొదట ఆ యింటి యిల్లాలు నన్ను చూస్తుంది.

ఆశతో ఆమె కళ్ళు మెరుస్తాయి ఒక్కసారి.

కొన్ని నిముషాలు.

ఆ గదిలో ఒంటరిగా మిగులుతాను నేను.

ఒక అమ్మాయి వస్తుంది - చేతిలో కాఫీగ్లాసుతో.

అమ్మాయి చాలా దీనంగా ఉంటుంది.

ఆమె కన్నులనిండా నీళ్ళుంటాయి.

కన్నులలో నీళ్ళతోపాటు-కట్టుకున్న చీరలోని చిరుగులనికూడా దాచుకుందుకు వ్యర్ధప్రయత్నంచేసి ఓడిపోతుంది.

జాలిగా నవ్వుతాను.

నన్ను [illegible] — [illegible]తాన్ని మా నాన్న సమస్యనీ గట్టెక్కించరూ అని ప్రాధేయపూర్వకంగా అడుగుతుంది.

నేనేదో చెప్పబోయేంతలో విశ్వపతి గారక్కడికి ప్రవేశిస్తారు.

అవకాశాన్ని వృథాపోనివ్వకుండా అందుకుంటారు. "నేను బహు బీదవాడిని. గంపెడు ఆడపిల్లలు. వీళ్ళ పెళ్ళిళ్ళ గురించి తలుచుకుంటూంటే గుండె బ్రద్దలైపోతూంది. కుటుంబానికి కడుపు నిండా అన్నంపెట్టడమే అతికష్టమౌతూంటే-కట్నాలిచ్చి పెళ్ళిళ్ళుచెయ్యటం నా తరమా ?

ఆ రోజులలో...నాకేమీ తెలియదు. ముందుచూపు లేకపోయింది. ఆరుగురాడ

పిల్లల్ని కన్నాను. అప్పటికి కుటుంబ నియంత్రణం గురించి ప్రచారంలేదు.

గత జల సేతుబంధనం అంటారా ? ఔను. ఇప్పుడు-పశ్చాత్తాపపడటంకంటె ఏంచేయగలను ?"

ఆయన కన్నులనిండా నీరు!

గొంతునిండా దుఃఖం !!

"మాధవ్ !-"

ఆలోచనలు తెగిపోయాయి.

తలఎత్తి చూశాను.

విశ్వపతిగారు.

"ఇంటికి వెళ్దామా ?" ఆత్రితగా అడిగారు.

గడియారం చూశాను.

ఐదు దాటుతోంది.

కప్‌బోర్డుకి తాళంవేసి- "పదండి-" అన్నాను.

విశ్వపతి గారిల్లు ఆఫీసుకి మరీ దూరమేమీ కాదు.

రిక్షా పిలుస్తానంటే నేనే వద్దన్నాను.

ఇద్దరమూ వారిల్లు చేరుకున్నాం.

ముందరి గది నీటుగానే ఉంది.

నేను వస్తానని ముందు తెలుసు కనుక దాన్ని అలా ఉంచారేమో !

నన్నొక కుర్చీలో కూర్చోబెట్టి లోపలికి వెళ్లారు విశ్వపతిగారు. నేనున్న గదికానుకుని పక్కనే ఒక గది ఉంది. రెండుగదులకీ మధ్య కిటికీ.

"చెప్పు...నువ్వనుకున్నట్లున్నాడా ? నీకు నచ్చాడా ?"

అది విశ్వపతిగారి స్వరం.

"ఊ."

తుళ్ళిపడ్డాను.

కిటికీలోంచి రెండు కళ్ళు నన్ను పరీక్షగా చూస్తున్నాయి.

విశ్వపతిగారి యీ ఏర్పాటు సబవుగా తోచలేదు.

ఆయనమీద కొంచెం కోపంవచ్చింది.

లేచి-వెళ్ళిపోవాలనిపించింది.

ఇంతలో పద్దెనిమిదిదాటిన ఒక అమ్మాయి కాఫీతో వచ్చింది. ఆమె వెనుక విశ్వపతిగారు.

"అమ్మాయి రత్న. పి. యు. సి. పాసైంది. ప్రైవేటుగా బి. ఏ. కి కడుతూంది."

"నమస్కారం."

నేనూ నమస్కారం చేశాను.

రత్న నా వంక అదోలా చూసి వెళ్ళిపోయింది.

ద్వారందగ్గర ఎవరో నిలుచున్నారు. విశ్వపతిగారి భార్య.

విశ్వపతిగారు గొంతు సవరించుకున్నారు. "క్షమించు మాధవ్. నీకు చెప్పకుండా ఒక పనిచేశాను."

"ఏమిటి ?"

"అదుగో... ఆవిడ మా శ్రీమతి. ఒట్టి పిచ్చిమాలోకం అంటే తప్పులేదు. మాకు ఆరుగురాడపిల్లలు. ఆ విషయం తలుచుకుని ఆవిడ ఒకటే కృమిలిపోతుంది."

"ఆ రోజులలో కుటుంబనియంత్రణం..."

"ఇప్పటంత ప్రచారం లేకపోయినా ఆనాడూ ఉండేది కుటుంబనియంత్రణం. నేను ఆపరేషన్ చేయించుకుంటాననే అన్నాను. కాని-ఆవిడ వీలుకాదంది."

"నిజమే బాబూ, నేనే వద్దన్నాను. కన్నమ్మకి కన్నకొద్దీ వాపు అంటారు. నిజమే. నేను ఒక మగనలుసుకోసం కొట్టుకుపోయాను." కల్పించుకుంది విశ్వపతిగారి శ్రీమతి.

"ఆడ అయితే ఏమిటి? మగ అయితే ఏమిటి?"

"నీ మాటా నిజమే. కాని...యింటికి నిండుతనం రావాలంటే ఆడపిల్లా, మగపిల్లవాడూ ఉండాలి ఎవరు లేక పోయినా లోటే."

కాదనలేకపోయాను.

కన్నీటితో అందామె. "ఆరుగురు ఆడపిల్లలనిచ్చిన భగవంతుడు ఒక్క మగపిల్లవాడి నివ్వలేకపోయాడు. అది మా దురదృష్టం."

ఆవిడ బాధని అర్థంచేసుకుందుకు ప్రయత్నిస్తూ ఉండిపోయాను.

"అందుకని ... కొడుకులాటి ఒక అబ్బాయిని తీసుకువచ్చి యింటికి పరిచయం చెయ్యమని తినేస్తూ వచ్చింది. నా కంటికి నువ్వు చాలా మంచివాడివని పించింది. ఇంటికి పిలిచాను," అన్నారు విశ్వపతి.

"ఏం బాబూ, నేను నిన్ను పెంపకం కోరడంలేదు. ఊరకే నిన్ను అబ్బాయీ అని పిలుచుకుంటాను. నన్ను అమ్మా అని పిలవగలవా?"

అంతా విచిత్రంగా ఉంది

ఆరుగురమ్మాయిలు నిత్యమూ అమ్మా అని పిలుస్తూనే ఉంటారు. అయినా యీవిడకి తృప్తిలేదు. ఒక అబ్బాయికూడా అమ్మా అని పిలిస్తేతప్ప ఆమెకు నిండుగా తోచదు. ఎంత సున్నితమైన మనస్తత్వం!

"నువ్వు చాలా మంచివాడివని నీ ముఖమే చెబుతోంది. ఇన్నాళ్ళూ నే నెదురుచూసింది నీలాటి అబ్బాయి కోసమే!- ఏం? నేను కోరరాని కోరిక కోరుతున్నానా? అప్పుడప్పుడు మా యింటికి వస్తూ - నన్ను అమ్మా అని పిలుస్తే...చాలు..."

"తప్పకుండా ..." మెల్లగా అన్నాను.

ఆమె కన్నులు సంతృప్తితో వెలిగాయి.

"కృతజ్ఞతలు అన్నయ్యా ..." ఆమె రత్న.

"అ...న్న...య్యా-"

"అన్నయ్యా!-"

"అన్నయ్యా!-"

"అన్నాయ్!-"

"అన్నా!-"

ఆరుగురు పిల్లలూ ఒక్కసారి నన్ను అన్నయ్యా అని పిలిచారు.

ఉక్కిరి బిక్కిరైపోయాను - వారి అభిమానంలో.

---

# అగ్నిపరీక్ష

## మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

"అప్పుడే లేచారేం ?"

"యెక్కడికెళ్ళావు ?.. ఆ డాక్టరు దగ్గరకే కదూ!"

"        "

"అక్కడేం పని ?" తీక్షణంగా అడిగాడు.

"సుజాతకు ఫోనుచేశాను"

"నీ ఆటలు నాదగ్గర సాగవు. వ్యభిచారిణీ.. వెళ్ళు. వెళ్ళవే, నా ఇంట్లో ఉండొద్దు." మెడపట్టుకుని గెంటాడు. గుమ్మంలో కూర్చున్నాడు.

"అమ్మా ! ఇంట్లోనివారు బయటికి, బయటివారు ఇంట్లోకి రావద్దు. ఇది నా ఆజ్ఞ. భారత ప్రభుత్వపు ఆజ్ఞ..." నవ్వుతూ లుంగీ పంచె యెత్తి పట్టి, ప్రచార్లు మొదలుపెట్టాడు. సరళ బెంగా చూడసాగింది. రెండు, మూడు గంటల క్రితం యెంతో సానుభూతిగా మాట్లాడిన భర్త నిర్దాక్షిణ్యంగా నిందిస్తుంటే అసహాయంగా చూడటం తప్పితే ఏంచేయగలదు!

తొందరగా డాక్టరుకు చూపించండమ్మా." డాక్టరుగారి పనిమనిషి సలహా ఇచ్చింది.

"డాక్టరుకన్నా, భూతవైద్యుడే నయము. గాలి, ధూళి సోకితే ఇంతే." డ్రైవరు సలహాఇచ్చాడు,కారు తుడుస్తూ.

"అంతే అయిఉంటుంది అబ్బాయి. ఈ మతిభ్రమణం మా ఇంటా వంటా లేదు." సుందరమ్మ మాట కలిపింది.

"యెవరికే మతిభ్రమణం. ."

"నీ...కాదురా... యెవరికోనట..." ఆమె వణికిపోతూ వేపచెట్టు మొదట్లో కూర్చుంది. సరళ అలాగే నిల్చుంది. అరగంట తరువాత సుజాత వచ్చింది, భర్తతో. ఆడబడుచును చూడగానే బావురుమంది సరళ.

"ఊరుకో.. .ఊర్కో వదినా. ."అన్నది బలవంతంగా కన్నీరు ఆపుకుంటూ.

"హల్లో విష్ణూ! యెలా వచ్చావు! కర్ఫ్యూ లేదూ, వాళ్లకు తెలియదేమిటి, తహసిల్‌దారిగారి అల్లుడని. ."

విష్ణు, పరీక్షగా, తీక్షణంగాచూచాడు. మాసినజుత్తు, పెరిగిన గడ్డం, లోతుకు పోయినదవడలు, చిరుగులుపట్టిన బట్టలు, ఎలుగు గొడ్డులా ఉంది ఆకారం.

"సుజా! . . . వచ్చావా. నీకంటే

ఆత్మీయులెవరున్నారు? ఈ కులటను పొమ్మను.''

"అన్నయ్యా!'' ఆమె ఆక్రందనతో పరిసరాలు, ఆక్రోశించాయి. వెళ్లి అతన్ని పట్టుకుంది.

"యెవరేమన్నారమ్మా! . . . కట్నం తేలేదని బాధపెట్టాడా? ఇదిగో విష్ణూ. . నేను యెవరనుకున్నావు? తహసిల్‌దార్ మనవడినికాను ఏకైక పుత్రుడిని. మా నాన్న సిఫార్స్‌తోఅమాంతం మంత్రి నైపోతాను. అప్పుడు ఏంకావాలన్నా ఇస్తాను. . ."

"అన్నయ్యా. .'' చటుక్కున అతని నోరు మూసింది.

"ఏమిటా వాగుడు? నన్నెవరూ ఏమీ అనలేదు. యెందికిలా మారిపోయావురా. .'' బావురుమంది.

''ఛ. నువ్వూ ఏడుస్తావా? నేను ప్రధానమంత్రి కావటం నీకు ఇష్టం లేదా?''

సుజాత ఏమనలేక, కన్నీరు ఒత్తుకోవటం మరచి అతన్ని చూచింది. నెమ్మదిగా అతని చేయిపట్టి నడిపించుకు పోయి, చెట్టు మొదట్లోని సిమెంటు చెప్టాపై కూర్చుండబెట్టింది. సుందరమ్మ బెదిరి లేచిపోయింది.

"చూడు సుజా. .అమ్మ నేనంటే భయపడుతుంది'' పక్కున నవ్వేశాడు.

"నువ్విక్కడే ఉండు, అరగంటలో వచ్చేస్తాను.'' విష్ణు వెళ్లిపోయ్యాడు. సరళ నెమ్మదిగా ఇంట్లోకి వెళ్లిపోయింది. పిల్లలు గుమ్మములో నిలబడి బిక్కు, బిక్కున చూచారు. "ఒరేయ్ రాజా! వెళ్లి మీ అమ్మను కాఫీ తెమ్మను. అత్తయ్య వస్తే అంతదూరం నిల్చుంటారా?" కసురుకున్నాడు.

"సుజా! మీ వదినను నిర్మల దయ్యం అయి పట్టినట్టుందే. ఒకటే పిచ్చి వాగుడు. ఆ డాక్టరుగారితో సరసాలు. నా కళ్లు కప్పగలదా?" గుస, గుసగా చెప్పాడు.

''అన్నయ్యా! ... నువ్వు కాసేపు ఊర్కుంటావా?''

"నిజం చెబితే నమ్మవుకదూ. . నిజంగా అదే కట్నం తెస్తే మన స్థితి యెంత బావుండేది. దాని పాదమహిమ భలే చెడ్డది. .''

అలా సాగుతూనే ఉంది అతని వాక్ప్రవాహము. సరళ కాఫీ తెచ్చింది.

"సుజాత వచ్చిందని తెలిసే ఇంత ఆలస్యం చేశావా?'' ఉరిమి చూచాడు.

"ఊర్కో అన్నయ్యా. దా మనము కాఫీ త్రాగుదాం." అతనిచేత కాఫీ త్రాగించి, తనూ త్రాగింది.

"చూడు సుజా! అమ్మకు కాస్త మతి చలించిందేమోనని అనుమానం." చిన్నగా నవ్వాడు. విష్ణు టాక్సీతో వచ్చాడు. బలవంతంగా యెక్కించి, డాక్టరు దగ్గరకు తీసుకుపోయారు. అతను రఘు వాలకము చూచి, నిదురకు

ఇంజక్షన్ ఇచ్చాడు. అతను నిదుర బోయాక, కుటుంబ విషయాలు, అతనికి మతి చలించక పూర్వము జరిగిన ముఖ్య సంఘటనలు వివరంగా అడిగి తెలుసుకున్నాడు. కొన్ని డైరీలో నోట్ చేసుకున్నాడు. అతను పెన్ను పెదాలకు ఆనించుకుని ఆలోచనలో పడ్డాడు.

"విష్ణూ! సీరియస్‌గా లేదు. కొంత మనశ్శాంతి అవసరము. అతని మనసునుబట్టి నడుచుకుంటే లాభం ఉంటుందేమో. నిర్మల చనిపోయిన పరిసరాలకు దూరంగా, ప్రశాంతంగా ఉండే చోటుకు మారిస్తే బావుంటుంది. వారి శ్రీమతి ఉద్యోగం మాని అతనికెదురుగా ఉంటే కొన్నాళ్లకు కుదురుతుందేమో ఆ తరువాత ఆస్పత్రిలో చేర్పించేందుకు ప్రయత్నం చేద్దాం."

ఇంటికి తిరిగివచ్చారు. సరళ విషయాలు విని, నిట్టూర్చింది. తను ఉద్యోగం మానేస్తే ఇల్లు గడిచేదెలా! భర్తను పడుకోబెట్టి, వంట ఇంట్లోకి వెళ్లింది ఫలహారం తయారుచేయటానికి.

"ఒకసారి ఇలా వస్తారా!" సుజాత బయట ఉన్న బాదం చెట్టుక్రిందకు వెళ్లింది. విష్ణు బయటికి వచ్చాడు.

"ఏమండీ, మీ ఇంటికి వచ్చిన దగ్గర నుండి నా అవసరాలు గ్రహించి, మీ అంతట మీరే అన్నీ చేశారు. ఈ రోజు నా అంతట నేను అడుగుతున్నాను. ఈ రెండు నెలలు అన్నయ్యను ఆదుకోండి. నాకు తెలుసు, ఇది శక్తికి మించిన పని. ." ఆమె కళ్లు నిండుకున్నాయి.

"కాని . . . ప్రేమగా తన భుజంపై పెంచాడు. గోరు ముద్దలు తిని పించాడు. ."

"సుజా!"

"నాకు తెలుసు, యెవరికయినా శక్తికి మించిన పని . . . మమతా బంధం. ." వెక్కి, వెక్కి ఏడ్చింది.

"నీకు మతి ఉండే ఇలా మాట్లాడుతున్నావా?" అతని గొంతు తీక్షణంగా ఉంది. అవును అతను యెందుకు ఆదుకుంటాడు తను కట్న, కానుకలు తేకపోయినా అతనికి అదనపు ఖర్చు తగిలిస్తుంది. కన్నీరు బొటా, బొటా రాలింది.

"రఘు నీకు అన్నేగాని, నాకేం కాడా? అతని బాగోగులు నాకు ముఖ్యం కాదా! నువ్వింత మూర్ఖురాలివని అనుకోలేదు. వృథా ఖర్చులంటే ఇష్టం ఉండదు. అంతమాత్రాన బావమరిదిని గాలికి వదిలేస్తానా!. ."

"ఏమండీ. ." అతని చేతులు పట్టుకుంది.

"ఇది మన పడకగది కాదు. ఆ ఏర్పాట్లు నేను చూస్తాను. నువ్వెళ్లి సరళ గార్కి ధైర్యం చెప్పు" అని వెళ్లబోయాడు.

"ఫలహారం చేసి వెళ్లండి. వదిన నొచ్చుకుంటుంది."

"అలాగే." ఇద్దరూ ఇంట్లోకివెళ్లారు.

## 41

విష్ణు పొలాల దగ్గరున్న రేకుల ఇంట్లో యెంతో ప్రశాంతంగా ఉంది. ప్రతిరోజు విష్ణు, డాక్టర్, ఒకోసారి సుజాత వస్తారు. రఘుకు చాలా నయంగానే కనిపిస్తుంది. మనిషి ఆరోగ్యంగా తయారయ్యాడు. సరళకు చాలా బాధగా ఉంది, ఆడబడుచు డబ్బు కూర్చుని ఖర్చుచేయటం. కాని వేరే మార్గాలు లేవు. నిరంతరం సుజాతకు తనవల్ల భారమనిపించకుండా ఉండాలని మార్గాలు వెతికేది రఘు మంచము ప్రక్కకు కూర్చుని ఆలోచిస్తుంది.

"అమ్మాయ్ నీదగ్గర ఏమయినా డబ్బు ఉందటే?"

"లేదత్తయ్యా..." అన్నది. ఆమెకు సుజాత ఇచ్చిన డబ్బు ఖర్చయింది. అభిమానము వదిలి తన అన్నలకు రెండు ఉత్తరాలు రాసినా జవాబులేదు. వారికే ఇల్లు గడవడం కష్టంగా ఉండొచ్చు. తనకేం పంపుతారు! ఒకతను ప్లీడరు గుమాస్తా, రెండో అతను హైస్కూల్ టీచర్. అతనికి గంప సంతానము. తమ్ముడు ఉన్నయెకరం పొలం సాగుబాటు చేస్తాడు.

"నేను చెప్పింది వినిపించిందా?"

"ఆం...ఏమిటత్తయ్యా?"

"పెద్ద జీతగాడు లేడూ, వాడి అల్లుడికి ఇలాగే అయితే యెన్ని వందలు పెట్టినా బాగవలేదటే." ఆసక్తిగా చెప్పింది. యెవరో మంత్రకాడు ముప్పై రూపాయలతో బాగుచేశాడట."

"మనకు చేతబడులు చేసేవారెవరత్తయ్యా?"

"ఏదో కన్నకడుపే తల్లీ. ఏంచేస్తే వాడు మనుష్యుల్లో పడతాడని నా తాపత్రయము. నీకు నిశ్చింతగా ఉంటే నాకేం? మా కాలంలో సూత్రాలమ్మి మొగుళ్లను బాగుచేసుకున్నాము." ఆవిడ నిష్ఠూరానికి సరళ నవ్వుకుంది. 'తన లాంటివారు యెందుకు పుడతారో తెలియదు' అనుకుంది. రఘు కట్నం లేకుండా సరళను వివాహం చేసుకున్న నాడు అందరూ అదృష్టవంతురాలని కొనియాడారు. ఆ అదృష్టము వెనుక ఇంత కక్ష, అసూయ పేరుకుని ఉంటుందని తెలిస్తే అన్నగార్లు అమ్ముడుపోయి ఇచ్చినా కట్నం తెచ్చుకునేది. పుట్టింటివారెవరూ రారు. ఇకమీదట సుజాత తప్పితే అత్తింటివారూ అంతే. అత్తగారి తత్వమేమిటో అర్థంకాలేదు. ఈ స్థితిలో కూడా కోడలిపై నిష్ఠూరం వేస్తుందనుకుంటే, ఈ రకం స్త్రీలు పుట్టుకతో వచ్చిన గుణం మార్చుకోలేరని తెలిసిపోయింది. చెవులకున్న ఏడురాళ్ల దిద్దులు తీసి ఇచ్చింది.

"అత్తయ్యా! వీటితో వారికి ఏదో చేయిస్తామన్నారుగా, చేయించండి." అవి తీసుకుని వెళ్లిపోయింది

సాయం|త్రం, కార్యభారం అంతా నెత్తిన వేసుకుని, నడిపించింది. మాం|త్రికుడు వచ్చి, చ|క్రం గీసి రఘును కూర్చో బెట్టాడు.

"నల్లకోడి, అయిదు మూరల నల్ల దారం..." ఇలా ఒక్కొక్కటే లిస్ట్ చెప్పాడు.

''ఇదంతా ఉంటుందనే కదా, ముందుగా డబ్బు మీ చేతిలో పెట్టాం."

"భలే మాట...అది అంబది. అంబ మీద ఆన. నాకెందుకు మీ డబ్బు."

ఒకటి తరువాత ఒకటి అడుగుతూనే ఉన్నాడు.

"సవాశేరు బియ్యం...అగరొత్తులు ...పసుపు ... ఆకులు ... ఆం...ఓ సవ్వారూపాయి భేతాళుడికి ముడుపు కట్టి ఆకులలో పెట్టు..." ఓగంట తతంగము తరువాత, రఘుకు స్నానంచేయించి ఆ బట్టలు ఒలిపించుకుని వెళ్లిపోయాడు. రఘుకు వేడి వేడి కాఫీ ఇచ్చి పడుకో బెట్టింది. పుణ్యం ఏమిటంటే అతను గొడవ చెయ్యక కూర్చున్నాడు, మం|త్రాలుచదివినంతసేపూ సుందరమ్మ ముఖం వికసించింది. కోడలు నిదుర పోగానే, గబ గబా బయటికి వెళ్లి బొడ్లో, మిగిలిన రూపాయలుపెట్టి, నౌకరును పంపి, మిఠాయి, పళ్లు తెప్పించి పంచిపెట్టింది.

"చూడవే...దేనిమహిమ దానిదే.. ఈ రోజు రఘు చాలా కోలుకున్నట్టు లేడూ."

"ఊం..." అంది. మనదేశంలో సగంమందికి మూర్ఖము, మూఢ భావాలపట్ల అచంచల విశ్వాసము. ఒక వైపు రాకెట్లు చం|ద్రమండలానికి వెడు తుంటే రెండోవైపు గురువులు,దేవతలు, దయ్యాలంటూ పూజలు పునస్కారాలు చేస్తుంటారు. దైవభక్తి, పాపచింతన మంచిదే. యెంతవరకు, ఆత్మవిమర్శ చేసుకుని, తను చేసే పనులు మంచివా, అని ఆలోచించేవరకే. మితిమీరితే మూర్ఖత్వము అవుతుంది. సుందరమ్మ లాంటివారు మనదేశంలో కోకొల్లలు.

## 42

"|ప్రభ పెద్దది ఉండగా, రమకు, వేణుకేం తొందర!" చికాకుగా అంది కాంతమ్మ.

"తొందరే. చూడమ్మా, కొన్ని విషయాలలో మీరు నాతో ఏకీభవించక పోవచ్చు. చదువు విజ్ఞాన సము పార్జనకు, ఉన్నతికి తోడ్పడితే మంచిది. మనము చదివించగల్గినా, మన పిల్లలు చదువగలరా, ఆలోచించాలి. |ప్రభకు చదివే నేర్పు, ఓర్పు, తెలివితేట లున్నాయి, చదివిస్తున్నాము."

"చిన్నపిల్లలు ఓ సంవత్సరం ఫేలయితే..."

"వచ్చే ఏడయినా అంతే. వాళ్లకు అనవసరమైన ఆలోచనలు వస్తాయి.

తమ అందచందాలు, అర్హతలు అటుంచి, ప్రతి అమ్మాయి డాక్టరో, కలెక్టరో, కావాలని కోరుకుంటారు. వచ్చిన సంబంధాలు నచ్చక, నచ్చినవారికి, వారడిగినది ఇచ్చుకోలేక, నడివయసు వచ్చేవరకు పెంచుతున్నారు ఆడపిల్లల్ని. కాలుజారితే వారి తప్పా?"

ఆ మాటలకు ఉలిక్కిపడిందామె. ఆమె పిన్నమ్మ కూతురుంది. ఆమెకు నలుగురు అమ్మాయిలు. చదువుల పేరుతో ఫాషన్లునేర్చుకున్నారు. డాక్టరు, కలెక్టరు అయితేనే పెళ్లిచేసుకుంటామని వచ్చిన సంబంధాలు తిరగగొట్టారు. ఇరవై యెనిమిది దాటాయి. వారిని గురించి, వారి శీలాన్ని గురించి మంచి అభిప్రాయం లేదు యెవరికి.

"ఏమ్మా..."

ఉలికిపడి ఇటు తిరిగింది. "ఆం... ఏంలేదు."

"నాకు వాళ్లంటే కోపమూ అమ్మా. ఇప్పుడు మనము చెబితే వినే స్థితిలో ఉన్నారు. ఇంకా కొన్నాళ్లయితే ఊహా జగత్తులో విహరిస్తారు. పెద్దా, చిన్నా అంటూ ఆలోచించే కాలం పోయిందమ్మా. జీవితం ఓ సుందర సౌధం. తెలిసీ, తెలియని వయసులో, కంటికి పూల నిచ్చెనలు కనిపిస్తాయి. వాస్తవం ఆలోచింపజేయాలి. ప్రతిమెట్టూ జాగ్రత్తగా యెక్కాలి. ఒక్క అడుగు తప్పుగా పడినా, జీవితం కుంటిదయిపోతుంది."

సంభ్రమంగా, గర్వంగా కొడుకు వైపు చూచింది కాంతమ్మ. వ్యక్తిత్వము, పురుషత్వము నింపుకుని, సమర్థవంతంగా ఈ సంసారచక్రం నడిపే కొడుకుని చూడ నోచని తండ్రిని తలుచుకుని కళ్లు ఒత్తుకుంది.

"నాకేం తెలుసురా. నీ ఇష్టం. అలాగే కానియ్యి. భగవంతుడు నీ రూపంలో నన్ను ఆశీర్వదించాడు."

"ఏం మాటలమ్మా..." తల్లిదగ్గర చాలాసేపు కూర్చుని పైకి వెళ్లాడు.

దాదాపు పెళ్లిళ్ల నిశ్చయమయినట్టే. మొదట గుణిసినా, తరువాత సంతోషంగా ఉన్నారు రేణు, రమలు. చలపతిని పిలిపించి, వారితోనే తాంబూలాలు పుచ్చుకున్నారు బంధువులు వెళ్లిపోయారు.

"విష్ణూ!"

"ఏమిటి చిన్నాన్నా?"

"ఆడవారి మాటలు వింటే అన్నీ అనర్థాలేరా."

"అదేమిటి!" ఆశ్చర్యంగా చూచాడు.

"వేరుగా వెళ్ళి ఏదో బాముకుందాం అనుకుంది మీ పిన్ని. ఇల్లు నరకంరా. మా అందరి మధ్య రాజీవ్ నలిగిపోతున్నాడు. మా కష్టాలు అటుండనీ, వాడు పూర్తిగా మారిపోయాడురా. త్రాగుడు.. త్రాగుడూ. వాడితో వాసంతి త్రాగుతుంది."

"చిన్నాన్నా?"

"పోనీలే. ఒకసారివచ్చి నువ్వయినా చెప్పు. వింటాడేమో."

''అలాగే!" చలపతి వెళ్ళిపోయినా విష్ణు అలాగే నిలబడ్డాడు. వెర్రిగంతులు, త్రాగటం నాగరికతా! ఏమో.

"మంచివాళ్ళకే కష్టాలు వస్తా యేమోరా. సరళ యెంత మంచిపిల్ల ...'' కాంతమ్మ సంబరంగా వచ్చింది.

"యేందుకమ్మా?'' దేనికి ఉపోద్ఘా తమో తెలియక అడిగాడు.

"రోజూ, పూలమొక్కలలోనేనట పని. యెండి వాడిన గులాబీలు, కన కాంబరాలు, మల్లెలు పూయిస్తుందట. జీతగాడు వచ్చాడు. రోజుకు పది రూపాయలు వస్తున్నాయట."

''అలాగా..." అన్నాడు. 'అభి మానధనురాలు' అనుకున్నాడు.

చెల్లెండ్ల వివాహాలు ఉన్నంతలో క్లుప్తంగా చక్కగా చేశాడు విష్ణు ఉదయ్ వాసంతి బంధువుల్లావచ్చి, అదిలేదు, ఇది లేదు అని ఆక్షేపించి వెళ్ళిపోయారు. వధూ, వరులను చూచి అందరు ముచ్చటపడ్డారు. వాడిదంతా ప్లాను ప్రకారం జరగాలి,'' అనుకుంది సుమతి మొదటిసారిగా. సుజాతతో ప్రేమగా మాట్లాడింది.

## 43

''అన్నయ్యా! నాగురించి ఇంత సంకుచితంగా ఆలోచిస్తావని ! నేను యెప్పుడూ అనుకోలేదు." వాసు ఆవే శంగా అన్నాడు. అతని ముఖం ఎఱ్ఱగా, రక్తం కక్కేలా ఉంది.

''చూడు వాసూ, నా మాటలు నిన్ను బాధపెడితే క్షమించు. పక్షులు రెక్కలు వచ్చేవరకే గూటిని అంటిపెట్టుకుని ఉంటాయి. నీ కయినా ఏం బాధ్యత లున్నాయి! చంద్రమౌళిగారు కూతురుతో పాటు వ్యాపారమంతా అప్పగిస్తాడట. ఉద్యోగంకంటే స్వతంత్రంగా బ్రతకడం మంచిదేగా..."

''ఒక్క ప్రశ్నకు జవాబు చెప్ప న్నయ్యా."

''అడుగు "

''చంద్రమౌళిగారింట్లో నేను స్వతం త్రంగా బ్రతకగలనంటావా! పోని నేను ఇల్లరికం వెళ్ళటం నీకిష్టమేనా!''

"ఇప్పటికే కుటుంబ శ్రేయస్సుకోరి, మీకు ఇష్టంలేనివి , నాకిష్టమైన పనులు చాలా చేయించాను. ఇంకా నిరంకుశ త్వంగా ప్రవర్తించలేను.''

''నా ప్రశ్నకు సమాధానము అది కాదు.''

"చూడరా, ఉదయ్ విషయములో సూటిగా చెప్పి, అవమానము పాల య్యాను. అందుకే...''

''అదికాదన్నయ్యా! చంద్రమౌళి ఆస్తితో నేను బాగుపడతానంటావా?''

"నా అభిప్రాయం మనిషి స్వయం కృషితో పైకిరావాలి. నీకు అభ్యంతరం

యెందుకు? ఆడపిల్లల బాధ్యతలేదు. ప్రభ యెలాగూ ఎక్స్‌ట్రాయే."

"అన్నయ్యా...మీకు కర్కోటకుదని పేరు ఎవరు పెట్టారోగాని, చాలా బాగా ఆలోచించే పెట్టారు. మీరు కర్కోటకులే." చర చర మెట్లు దిగాడు. సుజాత యెదురయినా పలుకరించలేదు. ఆశ్చర్యపోతూ పైకి వెళ్ళింది.

"వాసును ఏమయినా అన్నారా?"

"లేదే...వాడలా చెప్పాడా?"

"లేదు. అతని శ్వాస హోరు, నడక జోరు చూస్తే ఏదో జరిగిందనిపించింది."

"ఏంలేదు. వ్యక్తిత్వం అబ్బిందా, డబ్బు పేరు వింటూనే అన్నీ మరచిపోతాడా," అని ఒక ఊపు ఊపి చూచాను."

"ఓహో!"

"ఉదయ్‌లాంటివాడు కాడు. మనిషిలా బ్రతుకుతాడు. వయసు ప్రభావం వల్ల ఆవేశం సహజమేననుకో."

"రమ ఉత్తరం రాసింది. చదివి అత్త గారికి వినిపించాను."

"అబ్బో శ్రీరామచంద్రుడు నా కొడుకంటూ..."

"పాపం నిన్ను సీత అనలేదా?"

"అనాలని నాకేంలేదు. పిచ్చిస్త్రీ ఏం సుఖపడిందని..."

"పోనీ, నువ్వు సుఖపడుతున్నావా?"

"ఉహు-" వెక్కిరిస్తూ అతని సరసనే కూర్చుంది.

"బోరుగా ఉంది, సినిమాకు వెడదామా?"

"మీకు అంత తీరుబాటు ఉంటే వద్దంటానా!"

మరి త్వరగా తెములు. ఆడవాళ్ళ ముస్తాబుపట్ల వచ్చే కార్టూన్లు నిజం చేయకు."

"అయిదు నిమిషాలు. ప్రభకూడా వస్తుంది. రమా, వాళ్ళు వెళ్ళిపోయారా ఒక్కర్తి అయింది." సుజాత వెళ్ళిన దిక్కే చూచాడు మనుష్యులు పూర్తిగా స్వార్థపరులయి, తను, తనభర్త అనే ఈ రోజులలో సుజాతలాంటివారు అరుదుగా కనిపిస్తారు. అతనేదో గుర్తుకు వచ్చినట్టు, కోటుజేబులు వెతకసాగేడు బట్టల స్టాండ్‌వద్ద.

"రడీ సర్..." సుజాత వచ్చింది.

"కళ్ళు మూసుకుంటే మంచి బహుమతిస్తాను."

"సరే..." కుతూహలంగా కళ్ళు మూసుకుంది. మెడలో బరువైన వస్తువు పడగానే కళ్ళువిప్పింది.

"అప్పుడేనా, గాజులు వేయొద్దూ..." విసుక్కుంటూ చేతులకు రెండేసిగాజులు వేశాడు. చెవులవంక అసహాయంగా చూచాడు. పెద్ద పెద్ద రింగులు వ్రేలాడుతున్నాయి. సంభ్రమంగా చూచింది.

కెంపులు, ముత్యాలు పొదిగిన సెట్టు. తన ఇష్టము ఇతనికెలా తెలుసు!

"యెక్కడిది?"

"దొంగిలించాను."

"మనసులు దొంగిలించే నేర్పేకాక, వస్తువులు దొంగిలిస్తావా, మహాశయా!" అన్నది పొంగి పొరలే సంతోషం అదుపులో పెట్టుకుంటూ. మగవాడికి శాసించే గుణం, ప్రేమించే గుణం సమంగా ఉండాలి. గంగిరెద్దులా తలూపటం అసహ్యంగా ఉంటుంది.

"మరేం చేద్దాం. నీలాంటి భార్య ఉంటే..." దగ్గరగావచ్చి, ఆమెవంక ఆరాధనాపూర్వకంగా చూచాడు. "సుజా! పురుషుడువేసే ప్రణాళికలు విజయవంతం కావాలంటే, దానికి స్త్రీ అండదండలు యెంతో అవసరము. నీ సహకారం లేకపోతే ఈ సుడిగుండమునుంచి బయటపడేవాడినా!... నీ కోసం ఈ మాత్రము కొనలేనా?"

'కొనలేరని కాదు...అత్తయ్య..."

"అత్తయ్య ... అభ్యంతరం చెబుతుందనా! అమ్మకు నాపైకంటే నీపైనే ప్రేమ యెక్కువ. నీకేం కొనలేదని యెన్నిసార్లు నాతో దెబ్బలాడిందని..."

"అదంతా నా అదృష్టము. కోడళ్ళు చేసేపనులు గుర్తించే అత్తగార్లు యెందరున్నారంటారు'' అన్నది.

"వదినా! నేను రడీ ప్రభ వచ్చింది ఇద్దరూ బయటికి వచ్చారు

అలా ముగ్గురూ సినిమాకు వెడుతుంటే సుజాతకు తను రఘు, సరళతో వెళ్ళిన ఘట్టాలు గుర్తుకువచ్చాయి. భర్త, ఆడబడుచు చూడకుండా ఓ నిట్టూర్పు వదిలింది.

మర్నాడు ఆఫీసులో అడుగుపెట్టి ఆశ్చర్యపోయింది సుజాత. ఆమె సీట్లో వాసు కూర్చుని ఉన్నాడు. వదినను చూడగానే గౌరవపూర్వకంగా లేచి నిలబడ్డాడు. "రండి వదినా!'' కుర్చీలాగి, కూర్చోమన్నట్టు సైగచేశాడు. సుజాత నవ్వుతూ వెళ్ళి కూర్చుంది.

"మీకు యెప్పుడు వీలుంటే అప్పుడు ఈ ఆఫీసు రికార్డంతా నాకు చూపి, చార్జి ఇచ్చివేయాలి."

''మరి నేనేం చేయాలి?''

''ఇంటిదగ్గర పనులు చాలా ఉన్నాయి."

''ఎం. ఏ. చదివి...''

''ఎం. ఏ. చదవగానే ఉద్యోగం చేయాలని యెక్కడున్నది? మా పనులు మేం చేసుకుంటే తప్పేం ఉంది?"

సుజాత విస్ఫారిత నేత్రాలతో చూచింది. తను అడిగినంత డబ్బు ఇవ్వలేదని మూతి ముడుచుకునే వాసేనా? దినమంతా కూర్చుని అతనికి విషయాలు అర్థంచేసింది గుమాస్తాలు యెటువంటివారో అర్థంచేసింది.

మరి బాస్ గుణ, గణాలు చెప్పవేం?"

గంభీరంగా అడిగాడు, అంతకంటే గంభీరంగా ముఖం పెట్టింది.

"ఒట్టి కర్కోటకుడు. పనికి, అతనికి లంకె. ఎలా వేగుతావో..."

వాసు నవ్వేశాడు: సుజాత శృతి కల్పింది

''నువ్వు ఆటోలో వెళ్లిపో వదినా. అన్నయ్య యెన్నిగంటలకొస్తారు?''

"సాధారణంగా మూడు, నాల్గు గంటల మధ్య వస్తారు.''

అతను వాచ్‌మెన్‌ను పిలిచి ఆటో తెప్పించి ఆమెను పంపివేశాడు.

విష్ణు త్వరగా తన ప్రయివేటు రూమ్ కెళ్లి, కోటు సోఫాపై పడేశాడు. తిరిగి, తిరిగి అలసిపోయాడు. సుజాత ఆఫీసు పనిచేస్తుంది. బయటికి వెళ్లలేదు. రోజుకు మల్లే చిర పరిచితమైన గాజుల శబ్దం వినిపించలేదు. షర్టు చేతులు పైకి మడిచి రెండు చేతులలో, రెండు కప్పులు పట్టుకుని వచ్చి జాగ్రత్తగా స్టూల్‌పై పెట్టాడు వాసు. ఆశ్చర్యంగా చూచాడు విష్ణు, తువాలుతో ముఖం అద్దుకుంటూ.

శాత లేదా?"

వెళ్లింది.'' విష్ణు కూర్చు కెదురుగా కూర్చునాడు.

ందిరా?" మెల్లగా అడిగాడు ంటూ.

లేదు. సింసియర్‌గా వర్క్ గాళ్ల పేరు, పాడుచెయ్య కమ్మా, అని నిరుద్యోగి హోదాలో ఆమెను సస్పెండ్ చేశాను..."

విష్ణు ఫక్కున నవ్వాడు ఆ నవ్వుతోనే తెలిసిపోయింది అన్న తనను అభినందిస్తున్నాడని.

''ఒరేయ్ నాయనా, ఆ మాట పైకి అనేవు. ఇప్పటికే దేశం అంతటా, సత్యాగ్రహాలు, నిరసన వ్రతాలు, చెలరేగాయి. నీ ధైర్యం చూచి, మరికొందరు నిరుద్యోగులు వెళ్లి, స్త్రీలను సస్పెండ్ చేయగలరు.'' ఈసారి వాసు నవ్వాడు హృదయపూర్వకంగా.

''ఆలోచించే వచ్చావా?''

"బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. దేశసేవ చేయకపోయినా కనీసం నా వ్యాపారం నేను చేసుకుంటే, నిరుద్యోగులకు అండగా నిలిచినవాడ నవుతాను. ఆస్తులు తెగనమ్మి చదివిన నిర్భాగ్యులకు ఉద్యోగం రాని..."

"దేశంలో నూటికి పదిమంది నీలా ఆలోచిస్తే, నిరుద్యోగ సమస్యే ఉండదు.'' అన్నాడు తృప్తిగా ఊపిరి పీల్చుకుంటూ. "మూలకు కూర్చున్న ముసలమ్మకూడా ప్రభుత్వ ఉద్యోగం అంటే లేచి కూర్చుంటుంది రోజులలో."

"అదో సెక్యూరిటీగల జాబ్ కదన్నయ్యా. రిస్క్‌లేదు. పనిచేసినా, మానినా జీతం వస్తుంది."

అలా మాట్లాడినాక పని ఉందంటూ విష్ణు వెళ్లిపోయాడు. వాసు ఆఫీసులో

ఉండిపోయాడు. వారంరోజులలో వాసు కార్యదీక్ష అర్థం అయింది.

వాసు సీరియస్‌గా పనిచేసుకుంటుం డగా ఫోను వచ్చింది. యెవరా, అని యెత్తాడు.

"హల్లో...వాసూ... నేనురా, ఓ ఫియట్ అమ్మకానికి వచ్చింది. నువ్వు... వచ్చి చూస్తే కొనేద్దాము." ఫోను పెట్టేసి అలాగే నిలబడిపోయాడు. ఒకనాడు నిరంకుశత్వంతో శాసిస్తాడనుకున్న అన్నయ్యేనా, కారు కొనడంలో తన సలహా అడుగుతున్నాడు. యెందుకు? బరువు, బాధ్యతలు తెలుసనేగా.

పదకొండు వేలకు కారు కొన్నారు. ఇద్దరూ ఇంటికి బయలుదేరారు.

"నాకు ద్రాక్షతోట వేయాలని చాలా రోజులనుండి మోజుగా ఉదంన్నయ్యా."

"మంచిదే... పడమటివైపు పొలం బావుంటుందేమో.'

"అది బాగానే ఉంటుంది. రోడ్డు కున్నదయితే, ఇంకా బావుంటుంది."

"నీ ఇష్టం, సులువు ప్రకారము చూసుకో."

కారు ఇంటిముందు ఆగింది. వాసు పక్కన నవ్వుతూ "అన్నయ్యా! అటు చూడు."

విష్ణు వాసువైపు తిరిగి చూచాడు కారును చూచి యెవరో కొత్తవారనుకుని తోడికోడళ్లిద్దరూ, భుజాలమీదకు పమి టలు లాక్కుని, శ్రీరామ్‌ను తీసుకుని లోపలికి పోతున్నారు కంగారుగా.

"మనమని, కారు కొన్నామని ఏం తెలుసు!" అని తను దిగి తల్లిని, పిన్నిని పిలిచాడు విష్ణు.

"మీరేనా...కారు యెక్కడిదిరా!"

"కొన్నాము" అంటూ రెండో ప్రక్కనుండి దిగాడు వాసు.

"యెలా ఉందమ్మా కారు?"

కాంతమ్మ అలాగే చూస్తూ ఉండి పోయింది. మీరిద్దరూ దిగిరావటం ఇంకా బావుంది అని చెప్పాలనుకుని చెప్పలేక పోయింది.

"ఇద్దరూ తీరుబడిగా కూర్చున్నారు, పనేం లేదా ఏమిటి?" వాసు నవ్వుతూ అడిగాడు.

"ఆఫీసులో పని లేదట, మీ వదిన ఇంట్లో పని మొదలుపెట్టింది." కమలమ్మ అన్నది. అందరూ లోపలికి వెళ్లేసరికి టీ తెచ్చి పెడుతుంది సుజాత.

టీ త్రాగి పేపరు చూస్తూ వరండాలో కూర్చున్నారు. సుజాతకూడా

"ఏమండీ! కమలత్తకు వివాహము చూడాలని చాలా ఉంది."

"పోట్లాట కావాలని తమ ట్టుంది." వాసు పరిహాసము

"మరే..." సుజాత వెక్కి

"పిన్ని కోర్కెలో అ

ఆసందర్భం ఏంలేవు భర్త విహీన అయిన స్త్రీ, పిల్లల సుఖాలలోనే స్వర్గం చూస్తుంది."

''ఇంత ఉపోద్ఘాతం దేనికన్నయ్యా... వివాహము వద్దని అనలేదుగా.''

"మరి అమ్మాయిని...''

''అదంతా పెద్దవాడివి. నీ ఇష్టము.''

"నష్టపోతావ్ మరిదీ..." సుజాత పరిహాసం ఆడింది.

''అన్నయ్య ఛాయిస్ లాభసాటి బేరమని నిన్ను చూచి తెలుసుకున్నాను. ప్రత్యక్ష సాక్షానికి..."

''ఒరేయ్ వాసూ, నన్నిలా బ్రతక నియ్యరా..." విష్ణు భయము నటిం చాడు. పెద్దన్నయ్య ఇంత సరళంగా ఉంటారా, అని ప్రభ ఆశ్చర్యపోయింది.

పది దాటాక పైకి వచ్చింది సుజాత. విష్ణు ఆవులిస్తూ, తన రైటింగ్ బల్ల ముందునుండి లేచాడు.

''ఆఫీసులో ఉన్నప్పుడే నయం, తొందరగా వచ్చేదానివి.''

"అత్తయ్య కొడుకును దీవిస్తూ, పొగడుతూ..."

"ఏమని దీవించిందేమిటి ?''

' కొడుక్కి ఓర్పు నేర్పుచాలా ఉందట. అందుకని కనీసం పదిమంది సంతాన ముతో...''

"ఆగాగు...నాకు నేర్పున్నా పది మందిని కని పెంచే ఓపిక నీకుందా ?"

''ఉంటే...?"

"ఇంకేం. నావైపునుండి మరో ఇద్దర్ని కలుపుకో. డజను అవుతారు." కొంటెగా కళ్ళు చికిలించాడు.

"మీరు...చాలా మారిపోయారు."

అతను పెద్దగా నవ్వాడు. ''నీ రిస ర్చికి అభినందనలు."

"నిజం. ఇంత స్వచ్ఛంగా, హృదయ పూర్వకంగా నవ్వటం ఏనాడూ చూడ లేదు."

"బాధ్యతలు, సమస్యలు వచ్చే నవ్వును అణచివేస్తాయి. నాన్నగారు పోయిన క్రొత్తలో సాలీడు గూటిలో చిక్కుకున్న పురుగులా గిల, గిల లాడాను. నాన్నగారికిచ్చిన మాట నిల బెట్టుకోలేనేమో, చచ్చిపోవాలను కున్నాను...''

"వద్దండి.'' అతని నోరు మూసే సింది.

వారి ఆనందం అట్టేసేపు నిలువ లేదు. చలపతి బిక్కమొహముతో వచ్చాడు. ఉదయ్, అతని భార్య ప్రవర్తనకు విసిగిపోయిన రాజీవ్ ఇల్లు వదిలిపోయాడట.

''యెప్పుడు చిన్నాన్నా ?"

''రెండురోజులు అయింది. అంతటా వెతికాం. ఇక్కడ ఉంటాడన్న ఆశ ఉండేది...'' అతని ముఖం పాలి పోయింది.

"నువ్వేం దిగులుపడకు. నేను వెతికి తీసుకువస్తాను." హామీ ఇచ్చాడు.

"సుజాతా! చిన్నాన్నకు అన్నం పెట్టు..."

''వద్దురా...''

''దిగులుగా ఉంటే వాడు కనిపిస్తాడా"...అతను ఆలోచనలో పడ్డాడు.

## 44

రఘు శారీరకంగా బాగా కోలుకున్నాడు. దృఢంగా, పచ్చగా అయ్యాడు. భార్య కళ్లెదుట ఉండటం తృప్తిగానే ఉంది. అయినా అతని అనుమానాలు అతనికి ఉన్నాయి. అతను పేపరు చూస్తున్నా, దృష్టి అక్కడ లేదు. వంట చేస్తున్న భార్యను కేక వేశాడు.

"ఏమండీ...టీ కావాలా?"

"అక్కరలేదు. నువ్వు ఉద్యోగం పూర్తిగా మానేశావా? యెందుకు?"

"మీకిష్టం లేదని.'' తలవంచుకుంది.

"మంచిపని చేశావు." అది వెటకారమో, నిజమో, తెలియలేదు. ఇంకా ఏదయినా మాట్లాడతాడేమోనని చాలాసేపు చూసింది. అతను పైకప్పుకేసి చూస్తుంటే, ఆమె వంటింట్లోకి వెళ్లిపోయింది. రోజూ అడిగినట్టు రెండుసార్లు 'వంట అయిందా, సరూ' అని అడగలేదు.

"అమ్మా...అన్నమే..." పిల్లల

గోల వినలేక, త్వరగా వంట ముగించి కంచాలు పెట్టింది

''రండి భోజనానికి. మీ పిల్లలు గొడవ చేస్తున్నారు,'' అన్నది నవ్వుతూ.

''ఆం...ఏమిటి ?'' భావరహితంగా చూచాడు.

''భోజనం చేద్దాం రండి.''

''సరళా ! నేను ఇల్లు కదలటంలేదు. నువ్వు ఉద్యోగం మానేశావు ఈ డబ్బు ... ఖర్చులు ... యెలా వస్తుంది డబ్బు ?''

''.........''

''మాట్లాడవేం?''

''ఇప్పుడు అవన్నీ యెందుకు ?''

''ఓహో ! నువ్వింత ముద్ద పడేస్తున్నావు. అదే ప్రసాదం అనుకోమంటావా ?''

''.........''

''వాడే...ఆ డాక్టర్ రాజన్ పంపిస్తున్నాడు కదూ !''

''నీకెలా చెప్పాలి ?'' దెబ్బతిన్నట్టు చూచింది.

''మీరు అసమర్థులు, సంపాదన లేనివారని చెప్పడానికి ఇంత తిక, మక పడాలా !''

''అలా అనుకుంటే, ఈ రోజు ఇక్కడ ఉంటానా !''

''నోరు ముయ్యి.''

''మీకెట్లా ఇష్టమో, నన్నేం చేయమంటారో చెప్పండి. నన్ను ఈ టెలలాంటి మాటలతో బాధించవద్దు,'' అన్నది బాధగా

''నేను చెప్పడము, నీవు వినడం, యెప్పుడో గతించింది. సుజాత వ్యక్తిత్వాన్ని పొగిడేనాడే నీ అసలు రూపం బయటపడింది,'' అన్నాడు లేచి ప్రచార్లు చేస్తూ. ''నీవు మెత్తని కత్తివి భర్తదగ్గర ప్రేమనటిస్తూ, ప్రియునిదగ్గర హొయలు కురిపిస్తావు.''

''ఆపండి ... మీ మనసు గాయపడరాదని ఊర్కుంటే మితిమీరిపోయింది, మీ ప్రవర్తన. మీ కోసం ... మీ చెల్లెలు సుజాత ఈ ఖర్చులన్నీ భరిస్తుంది ఇది ఆమె పొలమే.''

''సుజాతా !'' అతని ముఖం తెల్లగా పాలిపోయింది.

''అవును. ఆమెసాయంత్రం వస్తుంది, అడగండి.''

''ఛీ...ఛీ ... సిగ్గులేదూ ! ఆడపిల్ల సొమ్ముతింటామా ! వారి దయాభిక్ష స్వీకరించటానికి నేనేం భిక్షగాడినా !''

''అదేదో మీరు తేల్చుకోండి అడుక్కుని తాగలేదా, అప్పుడు లేనిసిగ్గు ఇప్పుడెందుకు ?''

''ఛీ...ఇంత బ్రతుకు బ్రతికి...''

''యెంత బ్రతుకేమిటి ? మా తాతలు నేతులు త్రాగారు అన్నట్టు మాట్లాడితే యెవరికీ సమ్మతికాదు. మీ కోసం వాళ్ళు సాయంచేశారు. స్వీకరించాము. దాని

కేదో పరిష్కారమార్గము చూడాలిగాని, దురభిమానం పనికిరాదు."

"తెలివిలేనిదానివి. నోరు ముయ్యి."

"నిజమే. నాకే తెలివితేటలుంటే, మీరు తెచ్చేజీతం ఆదాచేద్దును. నోరు చేసి మిమ్మల్ని, ఇంట్లోవారిని అదుపులో పెడుదును. శాంతం, సహనం పేరిట, నా బాధ్యత విస్మరించాను. ఇటు సుఖము లేదు. అటు చేసిందన్న పేరులేదు." ఆవేశంగా అరిచింది. రఘు తగ్గిపోయాడు. కొందరి తత్వమే అంత. ఉరికినంతవరకు తరుముతూనే ఉంటారు. వెనుతిరిగి, ఆగితే, భయపడతారు.

"ఇంతకీ నువ్వు అనేది ఏమిటి ?"

"అనుమానం పెనుభూతం అంటాను. ఆవేశం పనికిరాదంటాను. మన కేమయింది ? మనకంటే హీనస్థితిలో ఉన్నవారు యెందరులేరు ? కష్టాలలో త్రాగుతున్నారా ? బాధ్యత విస్మరిస్తున్నారా ? ఆస్తి, పాస్తులు కావాలని నేను అడగలేదు..."

"మరి ఈ ఏడ్పు యెందుకు ?"

"మీ నైజానికి. ప్రతిదీ అపార్థమే గాని, అర్థంచేసుకోరు — ఇప్పటికయినా మించిపోయిందేంలేదు. ఇద్దరం పని చేసుకు బ్రతుకవచ్చు. మొగాళ్ళు నా వెంటపడటానికి నేనేం బాలా కుమారిని కాను, అసమానమైన అందకత్తెను అంత కంటే కాను..."

"ఊం..." గాఢంగా నిట్టూర్చాడు.

"వాడికి అసలే మతిలేదంటే నీ సాధింపులేమిటే. మీ పుట్టింటివారిది పోగొట్టాడా ! వాడిది, వాడు నాశనం చేసుకున్నాడు. మధ్య నువ్వెవరు ?" సుందరమ్మ అందుకుంది.

"నేను యెవరో వివరించి చెప్పాలా ? మీలాంటి మనుష్యు లున్నంతకాలం సంసారాలు నాశనం అవుతాయి. నా బిడ్డల్ని తీసుకుని వెళ్ళిపోతాను. వారిని మీరు బాగుచేసుకోండి," అన్నది. ఆమెకు సహనము నశించింది.

"అయ్యో...అయ్యో...ఏంమాటలే· నాకు చావెందుకు రాదు ... " అంటూ దినమంతా ఏడ్చింది. సాయంత్రం సుజాత రాగానే రాగాలుపెడుతూ కోడలు అన్నమాటలు చెప్పింది. సుజాత క్షణం ఆలోచించింది.

"అమ్మా ! వేళకు తిండిలేక యెంతగా చిక్కిపోయావో చూడు. కొన్నాళ్లు నా దగ్గర ఉందువుగాని రా. కమలత్త కూతురుదగ్గర కెళ్ళింది. అత్తయ్య ఒంటరిగా ఉంటుంది."

"అలాగేనే. నాకెవరూ లేరను కుంటుంది మీ వదిన."

వాళ్ళు వెళ్ళిపోయాక, సరళ ఒంటరిగా కూర్చుని ఆలోచించడము మొదలు పెట్టింది. రఘు ఉదయము తిని వెడితే, సాయంత్రమే ఇంటికి వస్తాడు. మతి చలించిన మనిషి. దారిలో ఏమైనా, ఏది దిక్కు ? తను ఇక లీవు పొడిగించితే, ఊస్ట్ చేస్తారు· అంతవరకు లీవు ఇవ్వడంకూడా విష్ణుకూ, వాళ్ళకూ ఉన్న పరిచయమువల్లే.

ఓ మధ్యాహ్నము అకస్మాత్తుగా వాసు వచ్చాడు· రఘు ఇంకా ఇంటికి రాలేదు·

"అక్కయ్యా ! అన్నయ్య మీకో విషయము తెలుపమన్నారు· ఆయనే వచ్చేవారు. రాజీవ్‌కోసం వెతుకు తున్నారు· బావ ఆఫీసులచుట్టూ, బడుల చుట్టూ, ఉద్యోగంకోసం తిరుగు తున్నాడు. ఈ కాలంలో ఉద్యోగం ఇచ్చేది యెవరు. రికమండేషన్ లేనిదే యెవరూ ఇవ్వరు. అన్నయ్య రికమం డేషన్ నిరాకరించాడట. సుధా మెమో రియల్ స్కూల్ హెడ్‌మాష్టరు మనకు బాగా తెలుసు· అక్కడో లెక్కల పోస్టు ఖాళీగా ఉంది. మేం అన్ని ఏర్పాట్లు చేశాము· బావను అక్కడకు పంపే భారము మీది."

"బాబూ !" ఆమె కన్నీటితో చూచింది. విప్పారిత నేత్రాలే యెంత సంతోష పడుతున్నాయో తెలుపు తున్నాయి.

"మరిక వెళ్ళిరానా ?"

"ఉండు బాబూ, కాఫీ అయినా తీసు కుని వెళ్దువుగాని."

"ఇంకోసారి వస్తాను అక్కయ్యా. చాలా పని ఉంది."

అతను వెళ్ళిపోయాక, నెమ్మదిగా పొలంవైపు వెళ్ళింది. కూరల మడులు

యెండుతున్నాయి. అదే విషయము జీత గాడితో చెప్పింది.

'నాకు తలనొప్పిగా ఉందమ్మా. ఒంగి నీళ్లు మలుపుతుంటే తల పడి పోయేలా ఉంది.''

"నేను నీళ్లు మలుపుతాను.''

''అమ్మా!" నోరు వెళ్ళబెట్టాడు ఇప్పటికే, మీరు చాలా పనులు చేస్తు న్నారు అన్న ధోరణిలో ఉంది పిలుపు.

"ఫరవాలేదు. ఊర్కే తింటున్నా మన్న బాధ ఉండదు.'' అని నీళ్ళు మలుపుతుంది. అలవాటు లేని పనులు, చెమటపట్టింది.

'సరూ...'' తలెత్తింది రఘు నిల బడి ఉన్నాడు. మధ్యలో వదిలేస్తే యెలా అని ఆలోచిస్తుండగానే, చలపతి జీత గాడు వచ్చాడు.

"అయ్యగారు వచ్చారు, మీరెళ్ళం డమ్మా.'' అతను అనగానే కాళ్ళు కడు క్కొని వచ్చింది. 'అయ్యో ఊరెలాంటిది' అని వెనుక యెవరో అడిగతే 'మొదట నీ నోరెలాంటిదో చెప్పు' అన్నారట. అలాగే, సరళ తన సరళత్వంతో అందరిని ఆ క ట్టు కు ం టు ం ది, అనుకున్నాడు.

''ఈ రోజు తొందరగా వచ్చారేం?''

"తిరిగి, తిరిగి కాళ్ళు పడిపోతు న్నాయి సరూ. యెక్కడికెళ్ళినా 'ఏజ్' అడ్డువస్తుంది. ఏంచేయను.'' ఇద్దరూ షెడ్డు చేరుకున్నారు. పిల్లలు చలపతి పొలంలో సొరకాయలు తెంపి గంప కెత్తుతున్నారు. 'తల్లి పోలికలు వచ్చాయి అనుకున్నాడు.

"సరళా ..."

"చెప్పండి ''

''నా బలహీనత... అర్థంచేసుకో నేను పిచ్చిగా మాట్లాడితే క్షమించు నీవు నిజంగా మనిషివి. అభిమానము మనసున్న మనిషివి. మనము ఒకరికి బరువు కావద్దనే కదా, ఆ పనులన్నీ చేస్తున్నావు." అతని కళ్లు నిండు కున్నాయి.

"మీరు అన్నారని నాకేం బాధలేదు మీరు ఆరోగ్యంగా ఉంటే అదే చాలు

"నీ వన్నది నిజమే సరూ. ఇద్దరం పనిచేసుకుని బ్రతుకవచ్చు...''

"మీరు చేస్తామంటే పనులవే దొరు కుతాయి. మొదట ముఖం కడుక్కోండి " అతను ముఖం కడుక్కొచ్చాక, హార్లిక్స్ ఇచ్చింది పిల్లలు చెరో సొరకాయ పట్టుకుని వచ్చారు. వారు కాళ్లు చేతులు కడుక్కొని, తల్లితో పాఠాలు చెప్పించు కుంటుండగా, అతను మైమరిచి చూచాడు పరీక్షగా చూచాడు. సరళకు పాపిట్లో వెంట్రుకలన్నీ తెల్లబడ్డాయి. కళ్ల క్రింద నల్లటి వలయాలు ఏర్పడ్డాయి. బుగ్గలు పీక్కుపోయాయి. చేతికి ఉన్న నీలం మట్టిగాజులు వదులయి మోచేతివరకు పోతున్నాయి. ఒంటిమీదున్న పెళ్లి నాటి పట్టుచీర చాలాచోట్ల కుట్టబడి

SISTA S DIL 349 TEL

# అందమైన ప్రతి ముఖం వెనుక ఒక రమ్యమైన రహస్యం ఉన్నది.




అందంగా ఉండాలను కోవటం మీ ఆశయం. మీ చర్మాన్ని ఆ విధంగా ఉంచటం క్రూక్స్ లాక్టో-కేలమైన్ పని.

క్రూక్స్ లాక్టో-కేలమైన్ పగలు, సాయంత్రము, రాత్రి నిద్రపోయే ముందు ఉపయోగించండి. మీ కాంతి ఇనుమడించి, ఎల్లప్పుడూ వికసించి ఉండేలా చేయగలదని మీరు కనుగొంటారు.

క్రూక్స్
## లాక్టో-కేలమైన్

కుఫార్-ఇంటర్‌ఫ్రాన్ లి.,
పోస్టు బాక్సు నం. 6582,
బొంబాయి 400 018

**అందంగా ఉండటానికి సరికొత్త రహస్యం**

ఉంది. అతని హృదయం ఆర్ద్రమయి పోయింది. మొదటిసారి ఆమె చిన్నాయన ఇంట్లో చూచినప్పుడు యెలా ఉండేది! ముద్దబంతి పూవులా, ముద్దుగా ఉండేది.

''పదండి అన్నాలు పెడతాను."

"నీతోనే కూర్చుంటాము అమ్మా."

"ఇంకో రోజు..."

"వద్దు సరళా. అందరికి వడ్డించు, అందరం తింటాము. ఆమె భర్తవంక ఒకసారి చూచి వడ్డించింది. భోజనాలు కాగానే పిల్లలు అలసి నిదరపోయారు. సరళ పని ముగించుకుని వచ్చింది. పిల్లల ప్రక్కన కూర్చోబోయింది రఘు చేయి చాపాడు. అతని చేయి పట్టుకుని లేచి మంచంలో కూర్చుంది.

"ఒక మాట చెప్పనా!"

''చెప్పు ప్లీజ్... మాట్లాడు సరూ''

"సుధా మెమోరియల్ స్కూల్‌లో మాథ్స్ టీచర్ పోస్టు ఖాళీగా ఉందట ఒకసారి ప్రయత్నించండి. ప్రయివేటు బడి కాబట్టి ఏజ్ రిస్ట్రిక్షన్ ఉండదను కుంటాను.''

"అలాగే.'' చాలా రోజుల తరువాత భార్యా, భర్తల మధ్య అడ్డుగోడ కూలి పోయింది.

మర్నాడు అప్పాయింట్‌మెంటు ఆర్డర్‌తో వచ్చాడు రఘు. అతని ఆనందం ఇంతా, అంతా కాదు. పిల్లలను దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"సరళా...ఓ సరళా...ఈ రోజే మనం ఇల్లు మారాలి.''

''ఒక నెలజీతం చేతికందనీయండి.''

"నా కదంతా తెలియదు. ఒక్కడ నాకు ముళ్ళమీద ఉన్నట్టుఉంది. అందుకే బడికి దగ్గరగా చూచాను. మూడు అయిదు ఒకే గది అయినా, బాగానే ఉంది''

''సరే...'' అన్నది. ఆమెకు అతనితో వాదం పెట్టుకోవటం ఇష్టం లేదు కాని ఇల్లు గడిచేది యెలా? అమ్మ డానికేం ఉంది. ఈ తోటలో డబ్బు అంతగా అవసరం అనిపించదు. ఉదయం పాలు తీయగానే, కొన్ని సరళ కిస్తారు కూరలు, పళ్ళు ఊర్కొనే వస్తాయి.

తన అసహాయతను, రఘు మొండి పట్టుదలను వివరిస్తూ సుజాతకో ఉత్తరం రాసి పంపింది.

## 44

విష్ణు విసిగి పోయాడు. రాజీవ్ ఆరా తెలియదు సుశీలమ్మ మంచం పట్టింది. పేపర్లో వేయిద్దామా అని ఒకోసారి అను కునేవాడు అప్పుడే టెలిఫోను మ్రోగింది

"హల్లో...యెవరూ ... వాసు ... ఏమిటి, మద్రాసు వెళ్లాలా!''

అతను ఆలోచనలో పడ్డాడు. మంచి సీజన్ తను ఏ మాత్రం అశ్రద్ధ చేసినా సంవత్సరం పొడవునా బాధ పడాలి. తయారయి, ఒకసారి సుశీలమ్మను

చూద్దాం అని పోయాడు హాల్లోని దృశ్యం చూచి, స్థాణువులా నిలబడి పోయాడు. వాసంతి దుస్తులు అధునాతనంగా ఉన్నాయి. అది మామగారి యెదుట అలా మాట్లాడుతూనే అసహ్యము వేసింది.

"మీరిలా ఉంటారనే, వాళ్ళు అలా తయారయ్యారు." భర్తను యెగదోస్తుంది.

"నాన్నా! ఏం చేశారు. మార్కెట్టు నుండి తెచ్చిన డబ్బు?" ఉదయ్ నిలదీశాడు.

"నేను త్రాగలేదు. తగలెయ్యలేదు. మీ అమ్మకు మందులు కొన్నానురా."

"చూచారా...మనము త్రాగుతున్నామని ఆక్షేపిస్తున్నాడు." వాసంతి గొంతు జీరబోయింది.

"ఏం కూశావ్ ముసలి నక్కా!" ఉదయ్ తండ్రి పైకి చేయి లేపాడు. బలహీనంగా ఉన్న చలపతి ఉండ చుట్టుకుపోయేవాడే. కాని ఉదయ్ చేయి గాలిలో ఆగడమే కాక అతని గూబ గుయ్యిమంది.

"పెళ్లాం" ముందు తల్లిని, తండ్రిని అవమానించే స్థితికి వచ్చావట్రా... రాస్కెల్..." విష్ణు కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

"అన్నయ్యా!" చంప అదుముకుంటూ, అనుకోని ఈ సంఘటనకు తెల్లబోయినట్టు నిల్చున్నాడు.

"వరపలు గుర్తున్నందుకు సంతోషం." అని వాసంతి వైపు తిరిగాడు. "ఏమ్మా... బి. ఏ. లో బండబూతులు నేర్చావా! నీ త్రాగుడు అలవాటు నీకు నాగరికతగా కన్పిస్తే, వేరే ఇంట్లో తాగి తందనాలు ఆడుకో. పెద్దలు, తల్లి తండ్రుల పైకి వాడిని వుసికొలిపి పశువును చేస్తావా!"

"మధ్య మీరెవరు..." అనాలనుకుంది. కాని విష్ణు ముఖం చూచి మాటలు మింగేసింది.

"ఉదయ్...నేను మద్రాసు వెడుతున్నాను. వచ్చేసరికి ఇల్లు ఖాళీ చేయాలి. లేకపోతే చేయించాల్సి వస్తుంది చిన్నాన్న పిన్ని నాదగ్గర ఉంటారు."

"అన్నయ్యా ... నువ్వు జరిగిందేం వినలేదు..."

"వినాల్సిన పని కూడా లేదు." విసురుగా గదిలోకి వెళ్లాడు. తల పట్టుకుని ఏడుస్తూంది సుశీలమ్మ.

(సశేషం)

**Printed and Published by A. Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001. Controlling Editor : "CHAKRAPANI"**

# మజాగా, హుషారుగా, కసిగా యవ్వనాన్ని జుర్రుకోండి!

కసిగా దూకవలసి వచ్చినప్పుడు చచ్చుబడిపోయి ఊరుకుంటారా? మీ కోసం కాసుకున్న యవ్వనాన్ని జుర్రుకోండి. మీరు మాత్రం ఎందుకు వదులు కోవాలి? వేలునొక్కితే చాలు వెండి పూత గల మెరిసే బిళ్ళలు. నేటి టానిక్ రసగుళికలు. కాలం చేజారినా, మీరు బేజారు కాకండి. ఎడతెరిపిలేకుండా, శక్తితో, నిండుగా యవ్వనంతో కులకండి.

శక్తివంతమైన జీవనానికి

## ఒకాసా

హార్మో-ఫార్మా లిమిటెడ్ లండన్-బెర్లిన్ వారి ఉత్పత్తి

(పురుషుల కోసం వెండి పూత గల బిళ్ళలు)

పేరెన్నికగన్న అన్ని మందుల దుకాణాల్లోనూ దొరుకుతుంది.

OKASA CO.PVT.LTD.,12K Gunbow Street, P. B. No. 396, Bombay-400001



